శ్రీ

# శ త క భా ర త ము.





గ్రంథకర్త,

పిసిపాటి సోమయ్య,

నూజవీడు.

శ్రీ



# శతక భారతము.

గ్రంథకర్త.

పిసిపాటి సోమయ్య.

1935



శ్రీ గౌరీ ముద్రాక్షరశాల, నూజవీడు.

 [ వెల 5 అణాలు.

# కృతజ్ఞత.



ఇందుఁ బీఠికఁ వ్రాసిన యుద్ధమతికి
రసను గ్రహియించి తమయభిప్రాయములను
దెలిపి యున్నట్టిబుధులకు దీని వ్రాయఁ
బ్రోత్సహించినహితులకు మ్రొక్కు లిడుదు.

గ్రంథకర్త.

# PREFACE.



I was asked by the author to write a preface to his work "Sathaka Bharatham" and I do so very willingly and with pleasure because, the whole of Bharatham – one of the greatest works of ancient Indian Culture – is rendered in easy and simple Telugu verses. At the end of each stanza, the author has explained its gist, thus making it easier for an average boy to understand it and thus enable him to remember the thread of the story.

It is the duty of every patriotic Indian-especially of Andhra youths to read and understand the glory of ancient Indian Culture and a knowledge of Bharatham is inevitable. Education – if it is to be real, lasting and patriotic, must instil in the minds of youth an ardent desire to read and understand his Country's Classic Works and Bharatham is one.

I have not come across a work in which the whole of Bharatham is presented to pupils in such easy poetic language. Every

stanza ends with "Bhakta Vatsala Krishna" and the very name is sure to rouse the pupils to a sense of reverence and godliness and thus check the growing tendency among the modern youths to declaim God.

The book is well suited for boys reading in standards IV and above and they can easily get by heart the stanzas – an aspect of instruction which is very much neglected in schools now a days.

I congratulate the author Mr. Picipati Somayya on his successful attempt and wish him every success in his venture.

**MADDIRALA RAMA ROW, B.A.L.T.**

27-12-34,
BEZWADA.

*(Retired Head-Master,*
*R. R. High School, Nuzvid.*
*and*
*EX President,*
*District Educational Council, Kistna.)*

క. భారతీసారము శతకము
గా రచియించితివి ముద్దుగా బాలురకున్
దీ రైన శబ్దసంపుటి
నౌరా! యని యబ్బురంబు నంద మనీషుల్.

ఉ. రామచరిత్రమంతయును వ్రాసినయట్టుల భారతంబు బల్
నీమముతోడఁ గందముల నేర్పుగఁ గూర్చితి వెల్లవారలున్
రామునిఁ గృష్ణుఁ బిల్వఁగ నిరంతర మో పసిపాటి సోమయా
ఖ్యా! నుతియేమిగావలె నిహంబుఁ బరంబును దక్కకుండునే!

27–12–34, నూజివీడు.
శతావధాని, పాగోలు సత్యనారాయణ,
హెడ్ క్లార్కు, డిప్యూటీ తహశీల్దారు ఆఫీసు.

---

లలి లక్షాధికమైన భారతము నెల్లన్ నూరుపద్యంబులం
బలుకంగావలె నందుఁ గందములఁ గావ్యప్రక్రియన్ భక్తవ
త్సలుఁ గృష్ణా యనుసత్కిరీటమున నంతెన్ బాలవిజ్ఞానతం
దిలమై యుండఁగ నీకృతింబిడ యహో! దివ్యంబు భావ్యంబునౌ.

క. భారతరామాయణముల
నేరరు మును నొకరు వ్రాయ నేరుపుమై నీ
వారెంటిని వ్రాసి యిపుడు
కీరితి నార్జించి తయ్య కృతకృత్యుఁడ వై.

2–1–35, కలువపాముల.
హరి రాధాకృష్ణమూర్తి.



శా. శ్రీకృష్ణున్ మది నిల్పి వ్రాసితివి సంసేవ్యంబు నీభారతం
బాకర్ణించినఁ గల్గు మోక్షపద మాహాత్మ్యంబు సంసిద్ధికిన్
ప్రాజ్ఞప్రముఖుల్ నిరంతరము లోఁ బ్రార్థించునాముద్ద నీ
వాకర్షించితి వద్దియే సతతమున్ హర్షంబుఁ జేకూర్చెడున్.

క. నన్నయ, తిక్కన, యెఱ్ఱన
పన్నినయాఫక్కి నెసఁగఁ బనిచెడు కుండన్
సన్నుతగతి శతకంబున
వన్నె లొలుకఁ బలికి తీవు భారతగాథన్.

మ. రసికుల్ మెచ్చఁగ వ్రాసియుంటివి గదా!
రామాయణం బంతయున్
బసివారెల్లఁ బఠింపఁగా నమల
భావం బొప్ప నీభారతం
బనఘా౦ం బగుఁ గందపద్యములు ని
త్యానందసంధానముల్
పిసిపాట్యన్వయ సోమసూర్యాఖ్యసుకవీ!
వే ప్రేమి పల్కం దగున్.

26—12—34,
నూజవీడు.

జోస్యుల సూర్యనారాయణశాస్త్రి,
కో ఆపరేటివ్ సూపర్వైజర్.




# శతకభారతము.



క. శ్రీరుక్మిణీమణీహృ
త్సారసమునఁ దభ్రంగ! పార్థసారథి! చక్రీ!
ద్వారవతీశా! నీపద
వారిజములఁ గొలుతు భక్తవత్సలకృష్ణా!

తా॥ లక్ష్మీస్వరూపురాలైన రుక్మిణీదేవియొక్క హృదయపద్మము నందు వసించు బలసినతుమ్మెదవంటివాఁడవును, అర్జునునకు రథసారథిత్వముఁ జేసినవాఁడవును, సుదర్శన మనుచక్రాయుధము ధరించువాఁడవును, ద్వారకాపురవాసులఁ బరిపాలించినవాఁడవును, భక్తులను దయతోఁ జూచువాఁడవును నగు ఓ కృష్ణా! నీపాదపద్మముల భక్తితో సేవించుచున్నాను

క. లోకహితార్థంబై నవ
తాకము నెత్తితి దశావతారమ్ముల, లో
కైకత్రాతవు నీ వని
వాకొన లోకములు భక్తవత్సలకృష్ణా!

తా॥ ఓ కృష్ణా! నీవు దశావతారములఁ దాల్చి, సమస్తలోకములవారును లోకరక్షకుఁడవు నీ వొక్కఁడవే యని నిన్ను సంస్తుతింప లోకోపకారకం బైన జెండా నెత్తితివి

క. ఏపుగ సంస్కృతభాషను
ప్రాపంచికధర్మములను ♦ భారతకథగా
రూపించినమునిఁ గృష్ణ
ద్వైపాయనుఁ దలఁతు భక్త ♦ వత్సలకృష్ణా! 3

తా॥ లోకానుకూల మగు సర్వధర్మముల నిముడ్చి, శ్రీమన్మహాభారతామ్నాయమును సంస్కృతభాషయందు రచియించినవ్యాసమునీంద్రుని మిగుల స్మరించుచున్నాను.

క. వ్రాసినాంధ్రకవీంద్రుల
ధీచతురుల నేఁటిబుధులఁ ♦ దెల్పెద మద్గ్రం
థోచితరచనాధికవా
గ్వైచిత్రిం గోరి భక్త ♦ వత్సలకృష్ణా! 4

తా॥ నేఁటి గ్రంథకర్తకవీశ్వరులను, బుద్ధివిశేషముఁ గలిగినయట్టి ప్రాజ్ఞులఁ బ్రసంగించువారలను, ఈ నా గ్రంథము రసవంతముగ నిర్మించుటకు వలసినవాక్చాతురిని యాశించి, కొనియాడుచున్నాను

క. మును వ్రాసితి రామాయణ
మును బాలురహృదయపద్మ ♦ ములు వికసింపం
గను, భారత మిప్పుడు వలుకు
పనికై తోడ్పడుము భక్త ♦ వత్సలకృష్ణా! 5

తా॥ ఓ కృష్ణా! నీకృపావలన నింతకుఁ బూర్వము శ్రీరామచరిత్రమును విద్యార్థుల మనస్సులకు సులభముగ గ్రహించుటకై "బాలరామాయణ" మను పేరఁ గూర్చితిని. ఇప్పుడు భారతకథను రచియించుటకు సాహాయ్యముఁ జేయఁ బ్రార్థించుచున్నాను.

క. శ్రీరామారమణి కిరవై
నారతరయశోవితాన ♦ సంశోభితమై
భూరమణీభూషణ మన
వారణపుర మొప్పు భక్త ♦ వత్సలకృష్ణా! 6

తా॥ లక్ష్మీదేవికి స్థానమై, స్వచ్ఛమైనకీర్తిపుంజములో మిక్కిలి ప్రకాశించుచున్నదై, భూదేవి ధరించి యున్నతొడవో అనునట్లు హస్తినాపుర మనుపట్టణ మొప్పలరుచుండును.

క. ఆపురి ధృతరాష్ట్రుం డను
క్ష్మాపతి గాంధారిం దనదు ♦ జాయామణిగాం
జేపట్టి, ధర్మనియమము
వ్యాపారత నేలు భక్త ♦ వత్సలకృష్ణా! 7

తా॥ ధృతరాష్ట్రుం డనురాజు (గాంధారదేశపురాజకుమార్తె యగు) గాంధారి యనుకాంతను పట్టపుదేవిగాం బరిగ్రహించి, హస్తినాపురమును న్యాయమార్గమునం బరిపాలించుచుండెను.

క. ఆరాజు పుట్టుగ్రుడ్డి స
దా రాజ్యము సేయ నగని ♦ తమ్ముండు పాండు
క్ష్మారమణుం డేలుబడి స
వారిగం దోడుపడు భక్త ♦ వత్సలకృష్ణా! 8

తా॥ ఆధృతరాష్ట్రుండు జాత్యంధుం డగుటవలన రాజ్యపాలనయం దతనికిం దమ్ముండైన పాండురాజు ఎల్లప్పుడును సహాయపడుచుండెను.

క. కుంతీమాద్రులు నాఁ జను
కాంతల నాపాండురాజు ♦ కల్యాణంబై
యెంతయు విభవశ్రీబల
వంతుండై వెలయు భక్త ♦ వత్సలకృష్ణా! 9

తా॥ ఆపాండురాజు కుంతి, మాద్రి యను పేరులు గలయువతులను వివాహమాడి, మిక్కిలి వైభవము, సంపద, బలముఁ గలవాఁడై ఒప్పుచుండెను.

క. ఆ పతులకుఁ బెదతండ్రియుఁ,
జాపకళావిదుఁడు, బ్రహ్మ ♦ చర్యాశ్రమదీ
క్షాపరుఁడు, భీష్ముఁ డన్నిటఁ
బ్రాపై వారలకు భక్త ♦ వత్సలకృష్ణా! 10

తా॥ ఆరాజులు ఇరువురకుఁ బెదతండ్రియును, అస్త్రవిద్యావిశారదుఁడును, అయిన భీష్ముఁ డనునతఁడు వారలకు సమస్తకార్యకరణముల యందుఁ దోడ్పాటగుచుండును.

క. వెండియుఁ దదాప్తజన్యుల
కండగ నృపకార్యవిధుల ♦ నలరును విదురా
ఖ్యుం, డాతఁడు నయవిద్యా
పాండితిఁ గడు మేటి భక్త ♦ వత్సలకృష్ణా! 11

తా॥ మఱియును, విదురుఁ డనునొక నయకళాపారగుఁడు ఆ భూపాలురకు రాచకార్యవిషయముల నెల్లప్పుడు సహాయుఁ డగుచుండును.

క. వాసిగ దుర్యోధనుఁడు
దుశ్శాసను లాదియగు పుత్రశతమున్ గాంధా
రీసతి గాంచెఁ గురుకులో
ద్భాసితులై చెలఁగ భక్తవత్సల కృష్ణా! 12

తా॥ పట్టమహిషి యగు గాంధారికి దుర్యోధనుఁడు దుశ్శాసనుఁడు మొదలుగాఁ గలనూర్వురుపుత్రులు కురుకులప్రఖ్యాతులుగ జన్మించిరి.

క. అనఘుల ధర్మజభీమా
ర్జునులను గనెఁ గుంతిదేవి సొంపుగ నకులున్
ఘను సహదేవుని మాద్రీ
వనితామణి వడసె భక్తవత్సల కృష్ణా! 13

తా॥ కుంతీదేవికి ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు అనుముగ్గురు పుత్రులును, యాసతీరత్న మగు మాద్రికి నకులుఁడు, సహదేవుఁడు అను నిద్దఱుకుమారులును పుట్టిరి.

క. కొండొక మునిశాపంబునఁ
బాండుమహీపాలవరుఁడు పంచత నొందెన్
రెండవసతి మాద్రియుఁ జనెఁ
బాండవులను వీడి భక్తవత్సల కృష్ణా! 14

తా॥ పాండురాజు కిందముఁ డను మునిశాపముచే మృతినొందెను. అప్పుడు అతని రెండవభార్య యగుమాద్రికాంత సహగమనముఁ జేసెను. ఇట్లు ఆయిరువురును పాండవుల వీడిచనిరి.

క. కౌరవపాండవసంతతి
నా రండఱు హస్తిపురినిఁ ♦ బటుబాలక్రీ
డారతిఁ బెరుఁగుచు విద్యా
పారగు లగుచుండ భక్త ♦ వత్సలకృష్ణా! 15

తా॥ అంత, హస్తినాపురమున కౌరవులును, పాండవులును బాల్యక్రీడలయందు మిగుల నాసక్తిఁ గలవారై వృద్ధినందుచు విద్యాభ్యాసము జేయుచుండిరఁగ; (దీనికిఁ బైపద్యములో నన్వయము.)

క. ఆటలఁ బాటలలో నా
నాఁటికిఁ బాండవు లధికు ల ♦ నంగ మెలఁగఁ ద
త్పాటవ మొసఁప సలిపి రే
ర్పాటులఁ గౌరవులు భక్త ♦ వత్సలకృష్ణా! 16

తా॥ పాండవులు క్రమక్రమముగా నాటలయందును, విద్యలయందును దమ్ము మించుచున్నట్లు గనుపట్టఁ గౌరవులు సహింపలేక అవ్వారి యభివృద్ధిని భంగపఱచుటకు యత్నింప సాఁగిరి.

క. గంగను ద్రోచియు, నురగము
లం గఱపించియు, విషంబు ♦ లం బెట్టియు గా
డ్పుంగొమరు సుయోధనుఁ డడ
పఁగను లేఁ డయ్యెఁ భక్త ♦ వత్సలకృష్ణా! 17

తా॥ కౌరవులలోఁ బెద్దవాఁడగు దుర్యోధనుఁడు భీముని గంగానదిలోఁ బడఁ ద్రోచియు, త్రాచుపాములచేఁ గఱపించియు, విషాన్నములఁ బెట్టియుఁ జంపఁ జాలకపోయెను.

క. నరుశరవిద్యాకుశలత,
మరుదాత్మజబాహువిక్ర ♦ మంబు, మఱి యుధి
ష్ఠిరుపదవియుఁ జూచి సహిం
పరు కురురాట్సుతులు భక్త ♦ వత్సలకృష్ణా! 21

తా॥ దుర్యోధనాదులు అర్జునుని యస్త్రవిద్యాప్రవీణతను, భీముని భుజబలాతిరేకమును, ధర్మరాజుయొక్క యౌవరాజ్యపదమునుఁ గాంచి ఓర్వఁ జాల కుండిరి.

క. కలుషాత్ము లైన యాకురు
కులజుల కనయంబు వారి ♦ కుపితోద్యోగం
బులఁ దోడ్పడు చుందురు సౌ
బలకర్ణాహ్వయులు భక్త ♦ వత్సలకృష్ణా! 22

తా॥ దురాలోచనపరు లైన కౌరవులకు వారలదుష్టప్రయత్నముల యందు (ఆకౌరవుల మేనమామయును, గాంధారదేశపురాజు అయిన సుబలుఁ డనువాని పుత్రుఁడును నగు) శకుని యనువాఁడును, (సూతపత్ని యైన రాధ యనుకాంతకు పెంపుడుకుమారుఁ డయిన) కర్ణుఁ డనువాఁడును అప్తమిత్రు లై నిత్యము సాయపడు చుందురు.

క. దయమాలి సుయోధనుదు
ర్నయమునఁ గురురాజు వార ♦ ణావతమునకున్
నయగుణులఁ బాండవేయులఁ
బయనము గావించె భక్త ♦ వత్సలకృష్ణా! 23

తా॥ ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని అవినీతికి లోబడి, దయారహితుఁ డై, సద్గుణసంపన్ను లగు పంచపాండవుల వారణావత మనుపట్టణమునకు వెడల నడపెను.

క. ఆపురి లాక్షాగృహమునఁ
గాపుర ముండంగఁ జేసి ♦ కౌంతేయుల, నా
పాపి సుయోధనుఁ డాయిలు
బాపురె! కాల్పించె భక్త ♦ వత్సలకృష్ణా! 24

తా॥ దుర్యోధనుఁడు పాండవులను ఆవారణావతపట్టణమున నొక లక్క యింట కాపుర ముండు నట్లు ఏర్పాటుచేసి, ఒకనాఁటిరాత్రియం దాగృహమును గాల్పించెను.

క. జ్వలనునిబారిం బొరయక
నలలితమతి విదురుదూత ♦ సమకూర్చిన భూ
బిలమార్గమునం జని రా
వల నల పాండవులు భక్త ♦ వత్సలకృష్ణా! 25

తా॥ ఆలాక్షాగృహ దహన సమయమున పాండవులు విదురువలనం బంపఁబడినయొకఖనకునిచేఁ దవ్వియుంచఁబడిన బిలమార్గమున నగ్నిహోత్రునిబాధనుండి తప్పించుకొని, గూఢచారులై సురక్షితముగాఁ బోయిరి.

క. చనునెడ నడవి హిండింబుం
డనురక్కసుఁ గూల్చి, వాని ♦ యనుజ హిడింబన్
మనుకొని భీముఁడు దన దగు
వనితగఁ జేకొనియె భక్త ♦ వత్సలకృష్ణా! 26

తా॥ పాండవు లట్లు పోవునప్పుడు అరణ్యమధ్యమున భీముఁడు హిడింబుఁ డనురాక్షసుని సంహరించి, వాని చెలియ లైన హిడింబ యనుదాని నామెకోరికప్రకారమూధర్మరాజుచే నాజ్ఞాపింపఁబడి వివాహమాడెను.

క. అనిలజువలన హిడింబకు
ఘనుఁడు ఘటోత్కచుఁడు వుట్టి ♦ గ్రక్కున నతఁ డా
జననిం దోడ్కొని వనులకుఁ
బనివిని గురునాజ్ఞ భక్త ♦ వత్సలకృష్ణా! 27

తా॥ అంత, భీమునివలన హిడింబకు ఘటోత్కచుఁ డనుపుత్రుఁడు జనించెను. అతఁడు కోరినప్పుడు తిరిగివచ్చెద నని తెల్పి, తండ్రియాజ్ఞ నంది, తల్లియైనహిడింబను దీసికొని అడవులకు వెడలి పోయెను.

క. కతిపయయాత్రల విప్రా
చితవేషము లూని, భిక్ష ♦ సేయుచుఁ గుంతీ
సుతు లేకచక్రపురి క
ప్రతిహతగతిఁ జనిరి భక్త ♦ వత్సలకృష్ణా! 28

తా॥ అట్లు పాండవులు కొన్ని ప్రయాణములు చేసినపిమ్మట బ్రాహ్మణవేషముల ధరియించి, భిక్షాశను లై ఏకచక్రపురాగ్రహారమునకు నిరాటంకముగఁ జనిరి.

క. ఆయగ్రహారమున నై
తేయుం డై నబకునిఁ గడ ♦ తేర్చిచి, జనులన్
హాయిగ మనఁ జేసెను ధృతి
వాయుతనూజుండు భక్త ♦ వత్సలకృష్ణా! 29

తా॥ పాండవులు ఆయేకచక్రపురాగ్రహారమున నివసించుచున్న సమయమునఁ, దత్సమీపారణ్యభూముల జనకంటకుఁ డై ద్రిమ్మరుచున్న బకాసురుఁ డనురక్కసుని భీముఁడు పరిమార్చి, గ్రామస్థులు నిరపాయముగా జీవించు నట్లు చేసెను.

క. అంతట ద్రుపదుని గేహా
భ్యంతరమున ద్రౌపదీస్వ ♦ యంవర మహానం
చెంతయు విని, చని రట బల
వంతులు పాండవులు భక్త ♦ వత్సలకృష్ణా! 30

తా॥ అంతట బ్రాహ్మణవేషధారులై యున్న పాండవులు ద్రుపదమహారాజు తనకుమార్తె యగు ద్రౌపదికి స్వయంవరమహోత్సవముఁ గావింపఁ బోవుచున్నాఁడని విని, అచ్చటకు వెళ్ళిరి.

క. ఇద యుంకువ నాసుత కని
ముదమున నొక మత్స్యయంత్ర ♦ మును గొట్టంగా
విదితముగ నేర్పరించె ద్రు
పదభూవల్లభుఁడు భక్త ♦ వత్సలకృష్ణా! 31

తా॥ ద్రుపదమహారాజు కనకమత్స్యయంత్రము నొండు నిర్మింపఁ జేసి, దానినిఁ గొట్టుటయే తనపుత్రికకు ఓలిధనముగాఁ బ్రకటించెను.

క. వచ్చినరాసుతు లెల్లరుఁ
జెచ్చెరఁ జని భంగపడుట ♦ చే నాయంత్రం
బచ్చఁపుద్విజవేషుఁడు వి
వ్వచ్చుఁడు దా నేసి భక్త ♦ వత్సలకృష్ణా! 32

తా॥ ఆద్రౌపదీస్వయంవరమునకు వచ్చినరాజపుత్రు లందఱును మత్స్యయంత్రమును గొట్టఁ జాలకపోయిరి. అప్పుడు విప్రవేషముఁ దాల్చి యున్న అర్జునుఁడు దాని నవలీలగా నేసెను.

క. పిమ్మటఁ గుంతీవ్యాసుల
సమ్మతిఁ గొని, పాండుసుతులు ♦ సరసతఁ గల్యా
ణ మ్మెౕరి కృష్ణ వరుసగఁ
బమ్మినహర్షమున భక్త ♦ వత్సలకృష్ణా! 33

తా॥ అటుతరువాత, పాండురాజపుత్రులైన ఐదుగురు తమతల్లియైన కుంతీదేవియొక్కయు వ్యాసమహామునియొక్కయు సమ్మతులఁ బడసి ధర్మానుకూలముగ ద్రౌపదిని వరుసగాఁ బెండ్లియాడిరి.

క. ఆవిధ మూరసి కురుపతి,
తా విదురుం బనిచి, కుంతిఁ ♦ దనయులఁ గృష్ణన్
రావించె గజపురికి స
ద్భావ మెసంగదుర భక్త ♦ వత్సలకృష్ణా! 34

తా॥ అట్లు, పాండవులు సజీవులై, ద్రౌపదీస్వయంవరవిజయోత్సాహులై, పాంచాలదేశమున నుండిరని ధృతరాష్ట్రుఁడు విని, విదురునిఁ బంపించి, కుంతీదేవిని, కుమారులైనపాండవులను, ద్రౌపదిని హస్తినాపురమునకుఁ దోడ్కొని వచ్చునట్లు చేసెను.

క. వెండియు హస్తిపురిని వా
రుండఁగఁ దగ దంచు నెంచి ♦ యొయ్యన ధృతరా
ష్ట్రుం డిచ్చె నర్ధరాజ్యముఁ
బాండుతనూజులకు భక్త ♦ వత్సలకృష్ణా! 35

తా॥ మఱియును, ధృతరాష్ట్రుఁడు పాండవులు హస్తినాపురమున నుండినఁ దనతనయులప్రతిభకు లోటు వాటిల్లు నని తలఁచి, వారికి అర్ధరాజ్యము నొసఁగి పంపివైచెను.

క. తమ్ములతో నింద్రప్ర
స్థమ్మున కపు డేఁగి, ధర్మ ♦ తనయుఁడు దమరా
జ్యమ్ములఁ దొడఁగె నేలో
పమ్మును లేకుండ భక్త ♦ వత్సలకృష్ణా! 36

తా॥ అప్పుడు ధర్మరాజు సహోదరసహితుండై ఇంద్రప్రస్థపురమునకుఁ జని, అటఁ దమవంతురాజ్యమును ధర్మయుతముగఁ బాలింప సాగెను.

క. ఆయెడ మేనతిక మని త్వ
దీయసహోదరి సుభద్ర ♦ దేవేరిగ నీ
వాయర్జునునకుఁ గూర్చితి
పాయని కూరిమిని భక్త ♦ వత్సలకృష్ణా! 37

తా॥ అవ్విధమున పాండవులు ఇంద్రప్రస్థపురమున నివసించు చున్న కాలమందు, కృష్ణా! నీవు నీసహోదరి సుభద్రను మేనయత్తకుమారుఁడైన అర్జునునకు నిచ్చి పరిణయముఁ జేసితివి.

క. శుభగుణుఁ డా ఫల్గునునకు
సుభద్రయం దఖిలశత్రు ♦ సూదనశౌర్యం
డభిమన్యునామతనయుఁడు
ప్రభవంబై యెసఁగె భక్త ♦ వత్సలకృష్ణా! 38

తా॥ సమస్తకల్యాణగుణసంపన్నులైన ఆసుభద్రార్జునులకు రిపుభయంకరవిక్రముం డగు అభిమన్యుఁ డనుపుత్రుఁడు జన్మించి ప్రఖ్యాతి వడసెను.

క. ద్రుపదవిభుతనయ క్రమముగ
నృపు లాపాండవులవలన • నిస్తులతేజో
నుపమబలాఢ్యులఁ బంచో
పపాండవులఁ గనియె భక్త • వత్సలకృష్ణా! 39

తా॥ ద్రౌపద ధర్మజభీమార్జుననకులసహదేవులవలనఁ గ్రమముగా ప్రతివింధ్యుఁడు, శ్రుతసోముఁడు, శ్రుతకీర్తి, శతానీకుఁడు, శత్రుసేనుఁడు అను ఐదుగురు ఉపపాండవులఁ గాంచెను.

క. అవలఁ బాండవమధ్యముఁ
డీవును ఖాండవముఁ గాల్చ • నెడ నగ్నికిఁ దోఁ
డై విబుధాళి నోడిచి, య
ప్పావకుఁ దన్పితిరి భక్త • వత్సలకృష్ణా! 40

తా॥ పాండవు లారీతి సుఖముండు నంత, ఓ కృష్ణా! నీవును అర్జునుండును ఇంద్రునిఖాండవవనము దహింప నగ్నిదేవునకుఁ దోడ్పడి, ఇంద్రాదిదేవతల నందఱ జయించి, అగ్నిహోత్రుని సంప్రీతుం జేసితిరి.

క. అలో నత్యుగ్రాగ్ని
జ్వాలలఁ బడి మ్రిందుమయుఁడు • శరణము వేఁడన్
జాలిఁ గొని వాసి విజయుఁడు
పాలన మొనరించె భక్త • వత్సలకృష్ణా! 41

తా॥ అఖాండవదాహసమయమున మయుఁడు అనుదానవశిల్పకారుఁ డొకఁడు అగ్నిజ్వాలలఁ బడి, ప్రాణములఁ గోల్పోవ నుండి, అర్జునునిశరణుఁ జొచ్చిన నతఁ డవ్వానిఁ గరుణించి రక్షించెను.

క. ఆ మాయుఁడు కృతజ్ఞతమై
భూమీశుం డైన ధర్మ ♦ పుత్రున కొసఁగెన్
శ్రీమన్మణిసభ నాక
స్వామియు నరు దంద భ క్త ♦ వత్సలకృష్ణా! 42

తా॥ ఆమయుఁడర్జునుఁడు తనకుఁ జేసినయుపకారమునకుఁ బ్రత్యుపకారము సేయ నెంచి, విచిత్రరత్నమయంబగునొకయపూర్వసభాభవనము నిర్మించి తెచ్చి, రాజచంద్రుం డైన ధర్మరాజునకుఁ గానుకగా సమర్పించెను.

క. ఆసభఁ గొలువై ధర్మజుఁ
డాశల నిజయశము నింపి ♦ యలరారఁ దనా
వాసమున నారదుఁ డొక
వాసరమున వచ్చె భ క్త ♦ వత్సలకృష్ణా! 43

తా॥ ధర్మరాజు శుభముహూర్తంబున మయసభాప్రవేశము సేసి సర్వదిక్కులయందుఁ దననిర్మలయశమ్ము వ్యాపింప రాజ్యపాలనము సలుపుచుండ నొకనాఁడు నారదమునిశ్రేష్ఠుఁ డచ్చటకు వచ్చెను.

క. సుర మునివరుఁడు ప్రసంగాం
తరమునఁ దగ ధర్మజునకుఁ ♦ దత్పితృవిహితం
బెఱిగించి, రాజసూయా
ధ్వర మొనరుపు మనియె భ క్త ♦ వత్సలకృష్ణా! 44

తా॥ దేవర్షి యగునారదుఁడు ధర్మరాజుతో ప్రసంగవశంబున నతనిజనకుఁ డగుపాండురాజు దేవేంద్రుసాలోక్యము నందుటకై అతనిచే రాజసూయమహాయజ్ఞముఁ జేయింపఁ దలంపు కలదని తెలుపఁ దన్నుఁ బనిచె ననిచెప్పి, తత్క్రతు వాచరింప వలసినదిగ నానతిచ్చెను.

క. అంత యుధిష్ఠిరుఁడు నినున్
సంతసమునఁ బిలిచి, గోష్ఠి ♦ సలిపి, ధరిత్రీ
కాంతుల నెల్ల జయింపఁగ
స్వాంతమునం దలఁచె భక్త ♦ వత్సలకృష్ణా! 45

తా॥ అంత ధర్మరాజు కృష్ణా! నిన్ను హర్షముతోఁ బిలిపించి, ఉచితగతినాలోచించి, నీనియోగమున రాజలోకముల జయింప నెంచెను.

క. పవనజుఁ డపు డీవును వా
సవియును దన్ననుగమింపఁ ♦ జని, మగధధరా
ధవుఁ డైన జరాసంధునిఁ
బవరమ్మునఁ గూల్చె భక్త ♦ వత్సలకృష్ణా! 46

తా॥ అప్పుడు మగధదేశాధినాథుఁ డగుజరాసంధునిఁ జంపునిమిత్తము కృష్ణా! నీవును, భీముఁడును, అర్జునుఁడును గలసి పోయితిరి; అట భీముఁ డొక్కఁడే ఆరాజును మల్లయుద్ధమునఁ బరిమార్చెను.

క. వీరులు నల్వురు తమ్ములు
ధీరతతో నవలఁ దనకు ♦ దిగ్విజయము సే
కూరుప ధర్మజుఁడు మఖ
ప్రారంభము సేసె భక్త ♦ వత్సలకృష్ణా! 47

తా॥ పిమ్మట ధర్మరాజు వీరులును, సోదరులును నగు భీమార్జుననకులసహదేవులు క్రమముగా పూర్వోత్తరపశ్చిమదక్షిణదిగ్విజయంబులు సేసి రాఁగ రాజసూయాధ్వర మొనర్ప ప్రారంభించెను.

క. ఆలలితాధ్వరమునఁ డాం
బూలము నీ కిడఁగ ధర్మ ♦ పుత్రుఁడు తొలుతన్
బోల దటు సేయు టని శిశు
పాలుఁడు నిను దూరె భక్త ♦ వత్సలకృష్ణా! 48

తా॥ అంత నారాజసూయమున ధర్మరాజు (భీష్మునాజ్ఞఁ గొని) కృష్ణా! జగదర్చితుండవును, యజ్ఞపురుషుండవును అయిన నిన్ను సకలరాజలోకసమక్షమున విధ్యుక్తవిధానమున తొలుదొల్తఁ బూజింప నది పాడిగాదని (చేదిదేశాధిపతి యగు) శిశుపాలుఁడు ధర్మరాజు నాక్షేపించి, నిన్ను నిందింపఁ దొడఁగెను.

క. నీలీల లెఱుఁగ లేమిం
జాలఁగ నట నిన్నుఁ దిట్టు ♦ జడు శిశుపాలున్
గూలిచి చక్రముచేఁ గ్రతు
పాలన సల్పితివి భక్త ♦ వత్సలకృష్ణా! 49

తా॥ కృష్ణా! నీవు లీలామానుషశరీరుండ వని తెలిసికొనఁ జాలక నిన్ను దూషింప సాఁగినమూర్ఖుఁ డగు శిశుపాలుని చక్రముచే ఖండించి రాజసూయమహాధ్వరము నిర్విఘ్నముగా నెరవేర్పించితివి.

క. ఇది యంతయుఁ గని, యీసున
మదిఁ గుంది, సుయోధనుండు ♦ మాయాద్యూతం
బొదవించి పాండవులసం
పదలం గొనఁ దలఁచె భక్త ♦ వత్సలకృష్ణా! 50

తా॥ అప్పుడు రాజసూయాధ్వరసమాగతుఁడైన దుర్యోధనుఁడు పాండవవిశేషవిజయోత్సాహంబులఁ దిలకించి, మనమున నీర్ష్యవహించి, మాయాద్యూతముఁ గల్పించి వారలసర్వసంపదల హరింప నెంచెను.

క. వనమునఁ బండ్రెం డగుహా
యనములు, నజ్ఞాతవాస • మబ్దం బెందే
జనపదమునఁ జలుపఁ జనిరి
పనివడి పాండవులు భక్త • వత్సలకృష్ణా! 57

తా॥ అప్పుడు పాండవులు తమతమయాయుధంబులఁ దాల్చి, పంరెండేఁడులు వనవాసంబును, నటమీఁద నొకయేఁడు ఏదైన నొక జనపదంబున అజ్ఞాతవాసమును జేయ వెడలిరి.

క. అలఘుతెపంబుల సలుపుచు,
ఫలములఁ దిని మునులగోష్ఠిఁ • బరఁగుచుఁ, గౌంతే
యులు సతితోఁ గాననములఁ
బలుపాట్లం బడిరి భక్త • వత్సలకృష్ణా! 58

తా॥ పాండవులు సతీసమేతులై ఉన్నతతపస్సుల నొనర్చుచు, ఫలాహారులై మానీంద్రసద్గోష్ఠిం బొద్దుపుచ్చుచు, కామ్యకము ద్వైతము మొదలుగాఁ గల మహారణ్యసీమలఁ బెక్కుకష్టము లనుభవించిరి.

క. తొలుతను గిమ్మీరుం డను
బలురక్కసుఁ డెదురు వచ్చి • పథ మరికట్టన్
జల మూని వాని భీముఁడు
బలివెట్టెను బోర భక్త • వత్సలకృష్ణా! 59

తా॥ మొట్టమొదట (బకానురునితమ్ముఁడైన) కిమ్మీరుఁడు అను రాక్షసుఁడు పాండవులకు ఎదురుపడి మార్గావరోధము సేయ సంకింప భీమసేనుఁడు పట్టుదల వహించి వానిని సంహరించెను

క. ఈశునకై తపమును బా
రాశర్యననుజ్ఞ సల్పి ♦ ప్రత్యక్షముగాఁ
జేసికొని, నరుఁడు వొందెను
బాశుపతాస్త్రంబు భక్త ♦ వత్సలకృష్ణా! 60

తా॥ అర్జునుఁడు ఈశ్వరునిఁ గూర్చి ఘోరతప మాచరించి, కిరాతరూపమున శివునిఁ బ్రత్యక్షము చేసికొని ఆయనతోఁ బోరి మెప్పించి, అప్పరమేశ్వరువలన పాశుపత మను దివ్యాస్త్రమును బొందెను.

క. శతమఖనందనుఁ డమరా
వతి కొక్కెడ నేఁగ, సతని ♦ వలచి యట నిరా
కృతయై, యూర్వశి పేడిగ
బ్రతుకు మని శపించె భక్త ♦ వత్సలకృష్ణా! 61

తా॥ అర్జునుఁ డొకప్పుడు దేవేంద్రు నాజ్ఞచే అమరావతీపట్టణమునకుఁ బోవ నక్కడ ఊర్వశి యను నప్సరస్త్రీ అతనిఁ గామించి, విఫలమనోరథయై, క్రోధము వహించి, స్త్రీజనమధ్యమున నపుంసకుఁడుగా నుండునట్లు అతనికి శాప మిచ్చెను. (ఇది ఒకవత్సర మాత్రముగ తను నాతి నింద్రునిచే నిర్ణయింపఁ బడియె.)

క. పౌలోమకాలకేయుల,
నోలి నివాతకవచు లను ♦ నుగ్రాసురులన్
గూలిచె నాజినిఁ బార్థుఁడు
పాలితశౌర్యుండు భక్త ♦ వత్సలకృష్ణా! 62

తా॥ మహావీరుఁడైన అర్జునుఁడు ఇంద్రునానతిచేఁ జని, పాతాళవాసు లైన నివాతకవచు లనుమూఁడుకోట్లరాక్షసులతోను, హిరణ్యపురవాసు లయిన పౌలోమకాలకేయు లను నఱువదివేలరాక్షసులతోను, ఘోరయుద్ధము సేసి వారల సంహరించి దేవతలకుఁ బ్రీతిఁ గావించెను.

క. గంధర్వులు దుర్యోధను
బంధితుఁ గావింప నాని ♦ వనలించిరి యా
గంధర్వుల నోడించి స
ద్బాంధులు పాండవులు భక్త ♦ వత్సల కృష్ణా! 63

తా॥ దుర్యోధనుఁడు కర్ణాదులతో నాలోచించి, ద్వైతవనస రోవరసమీపమున నరణ్యవాసముఁ జేయు చున్న పాండవులఁ బరిహసించు నిమిత్తము ఘోషయాత్ర యనుమిషఁ బెట్టుకొని కళత్రపుత్రమిత్రపరివార సహితముగా వచ్చి, చిత్రసేనాదిగంధర్వవీరులచేఁ బట్టువడ పాండవులు సద్బాంధవులు గాన నతనిదుష్టత్వమును బాటింపక ఆగంధర్వుల నోర్చి, అతని విడిపించిరి.

క. ద్రుపదసుత వలచి సైంధవుఁ
డపహరణము సేయు మారు ♦ తాత్మజుఁ డపు డా
నృపుగర్వ మడఁచి పనిచెను
ప్రపూర్ణబల మలర భక్త ♦ వత్సల కృష్ణా! 64

తా॥ పాండవులు కామ్యకవనమునఁ దమయాశ్రమస్థానమున ద్రౌపది నునిచి, వేఁట కరుగ, నాసమయమున సాల్వకన్యను వివాహమాడ నాదారినిఁ బోవు చుండిన (సింధుదేశాధిపతియు దుర్యోధనాదులచెలియ లగుదుస్సలపెనిమిటియు నైన) సైంధవుఁడు ద్రౌపదినిఁ జూచి, ప్రేమించి, బలాత్కారముగ నెత్తికొని పోవుచుండ నప్పుడే ఆశ్రమాభిముఖు లై వచ్చుచున్న పాండవు లావార్త నెఱిఁగి, సైంధవుని వెంబడించి జయించి, ద్రౌపదిని విడిపించిరి. అప్పుడు భీముఁడు నిజకృపాణముచే నావ్యపుశిర మును రేవులుగ గొఱిగి, హాస్యాస్పదునిఁ జేసి పంపించెను.

క. సురయక్షమౌనిభూసుర
వరసంతతు లెదలఁ బొంగి • వరముల నిడఁ బు
చ్చిరి కాలము పాండుధరా
వరసుతు లడవులను భక్త • వత్సలకృష్ణా! 65

తా॥ శివుఁడు, ఇంద్రాదిదేవతలు, యక్షులు, మునిశ్రేష్ఠులు, బ్రాహ్మణోత్తములు పాండవులపట్లను శౌర్యాదులకుఁ దృప్తిఁ జెంది, పెక్కు వరములఁ బ్రసాదించుచుండ వార లుపాయముగ పండ్రెండుసంవత్సరముల వనవాసకాలమును వెళ్ళఁబుచ్చిరి.

క. వనవాస మటుల ముగియం
గను దగ నజ్ఞాతవాస • కాలము సలుపన్
జని రంత మత్స్యనగరికి
వని విడి పాండవులు భక్త • వత్సలకృష్ణా! 66

తా॥ అవ్విధమున పాండవులు అరణ్యవాసముఁ బూర్తిసేసి, తమ నొరు లెఱుఁగకుండ నొకయేఁడు అజ్ఞాతవాస మొనర్చుటకు మత్స్యదేశాధీశ్వరుఁడైన విరాటరాజుకడకు ద్రౌపదీసహితులై మాఱువేషములతో నేఁగిరి.

క. కంకుం డన ధర్మజుఁడు ని
రంకుశగతి నేఁగి, విరటు • నాస్థానమునన్
బొంకముగఁ గతలు సెప్పెను
వంకను గొలు వందె భక్త • వత్సలకృష్ణా! 67

కం. గంధర్వులు దుర్యోధను
బంధితుఁ గావింప నపని ♦ వదలించిరి యా
గంధర్వుల నోడించి స
ద్బంధులు పాండవులు భక్త ♦ వత్సలకృష్ణా! 63

తా॥ దుర్యోధనుఁడు కర్ణశకునులతో నాలోచించి, ద్వైతవనస రోవరసమీపమున నరణ్యవాసముఁ జేయుచున్నపాండవులఁ బరిహసించు నిమిత్తము ఘోషయాత్ర యనుమిషఁ బెట్టుకొని కళత్రపుత్రమిత్రపరివార సహితముగా వచ్చి, చిత్రసేనాదిగంధర్వవీరులచేఁ బట్టువడ పాండవులు సద్బంధువులు గాన నతనిదుష్కృత్యమును బాటింపక ఆగంధర్వుల నోర్చి, అతని విడిపించిరి.

కం. ద్రుపదసుత వలచి సైంధవుఁ
డపహరణము సేయ మారు ♦ తాత్మజుఁ డపు డా
నృపుగర్వ మడఁచి పనిచెను
ప్రపూర్ణబల మలర భక్త ♦ వత్సలకృష్ణా! 64

తా॥ పాండవులు కామ్యకవనమునఁ దమయాశ్రమస్థానమున ద్రౌపదిని నునిచి, వేఁట కరుగ, నాసమయమున సాల్వకన్యను వివాహమాడ నాదారినిఁ బోవుచుండిన (సింధుదేశాధిపతియు దుర్యోధనాదులచెలియ లగుదుస్సలపెనిమిటియు నైన) సైంధవుఁడు ద్రౌపదినిఁ జూచి, మోహించి, బలాత్కారముగ నెత్తికొని పోవుచుండ నప్పుడే ఆశ్రమాభిముఖులై వచ్చుచున్నపాండవు లావార్త నెఱిఁగి, సైంధవుని వెంబడించి జయించి, ద్రౌపదిని విడిపించిరి. అప్పుడు భీముఁడు నిజకృపాణముచే నానృపుశిరము రేవులుగ గొఱిగి, పరిహాస్యాస్పదునిఁ జేసి పంపించెను.

క. సురయక్షమానిభూసుర
వరసంతతు లెదలఁ బొంగి ♦ వరముల నిడఁ బు
చ్చిరి కాలము పాండుధరా
వరసుతు లడవులను భ క్త ♦ వత్సలకృష్ణా! 65

తా॥ శివుఁడు, ఇంద్రాదిదేవతలు, యక్షులు, మునిశ్రేష్ఠులు, బ్రాహ్మణోత్తములు పాండవులసద్గుణశౌర్యాదులకుఁ దృప్తిసెంది, పెక్కువరములఁ బ్రసాదించు చుండ వార లుపాయముగ పండ్రెండుసంవత్సరములవనవాసకాలమును వెళ్ళఁబుచ్చిరి.

క. వనవాస మటుల ముగియం
గను డగ నజ్ఞాతవాస ♦ కాలము సలుపన్
జని రంతె మత్స్యనగరికి
వని విడి పాండవులు భ క్త ♦ వత్సలకృష్ణా! 66

తా॥ ఆవిధమున పాండవులు అరణ్యవాసముఁ బూర్తిసేసి, తమ నొరు లెఱుఁగకుండ నొకయేఁడు అజ్ఞాతవాస మొనర్చుటకు మత్స్యదేశాధీశ్వరుఁ డైన విరాటరాజుకడకు ద్రౌపదీసహితులై మాఱువేషములతో నేఁగిరి.

క. కంకుం డన ధర్మజుఁడు ని
రంకుశగతి నేఁగి, విరటు ♦ నాస్థానమునన్
బొంకముగఁ గతలు సెప్పెను
వంకను గొలు వందె భ క్త ♦ వత్సలకృష్ణా! 67

తా॥ ధర్మరాజు కంకుఁడు అనునామధేయముఁ దాల్చి, సన్యాసివేషములో విరాటరాజుకడ కేఁగి, తద్రాజసభాస్థానమున నిత్యము పుణ్యకథల వినిపించి ప్రీతి పుట్టించుటకై కొలువు గొనెను.

క. ఒంటిగఁ జని భీముఁడు ని
ష్కంటకమతితోడ మత్స్య ♦ జనపాలునిదా
నింటను వలలుం డనఁగను
వంటలవాఁ డయ్యె భక్త ♦ వత్సలకృష్ణా! 68

తా॥ భీముఁడు వలలుఁడు అను పేరుఁ బెట్టుకొని, విరటునివంటసాలలో వంటలవాఁడుగ సేవింపఁ దొడఁగెను.

క. విరటునికన్నియ కంతః
పురమున నాట్యకళ నేర్పఁ ♦ బూనుచు వేడ్కన్
నరుఁడు బృహన్నల నాఁగను
బరఁగెను పేడి యయి భక్త ♦ వత్సలకృష్ణా! 69

తా॥ అర్జునుఁడు (ఊర్వశీశాపకారణమున నైన) పేడిరూపము ధరించి, బృహన్నల అను నామముతో విరటునియొద్ద కరిగి, అతనిపుత్రిక యైన ఉత్తర మొదలుగాఁ గల యంతఃపురకన్యలకు నృత్తగీతాభినయంబులఁ గఱపుటకు కొలువు కుదిరెను.

క. రయమున దామగ్రంథ్యా
హ్వయమును గొని నకులుఁ డరిగి ♦ యావిరటునివా
హయముల శిక్షింపఁగ ని
ర్భయగతిఁ దా నమరె భక్త ♦ వత్సలకృష్ణా! 70

తా॥ నకులుఁడు దామగ్రంథి అను నామధేయము వహించి, విరాటరాజుదగ్గఱకుఁ జని, తాను అశ్వవిద్య నెఱిఁగినవాఁడ నని తెలిపి, ఆరాజుకడ నశ్వశిక్షకుఁడుగఁ బ్రవేశించెను.

క. మేలుగ సహదేవుఁడు గో
పాలుఁడుగాఁ బోయి, మత్స్య ♦ పతికడఁ దంత్రీ
పాలసమాఖ్యను గోవులఁ
బాలింపం గుదిరె భక్త ♦ వత్సలకృష్ణా! 71

తా॥ సహదేవుఁడు గోపవేషముఁ దాల్చి, తంత్రీపాలుఁడు అను నామముతో విరాటుని సమీపించి, అతనికడ గోవులకాపరిగఁ జేరెను.

క. ద్రోవది మాలిని నాఁ జని,
పూవులఁ గూర్చుచును మాత్స్య ♦ పొలఁతి సుదేష్ణన్
సేవింపఁగ సైరంధ్రీ
భావముతో నిలిచె భక్త ♦ వత్సలకృష్ణా! 72

తా॥ ద్రౌపది సైరంధ్రీవేషము ధరించి, మాలిని అను పేరు పెట్టుకొని, విరాటరాజునంతఃపురమున నారాజదేవి యగును దేష్ణయొక్క పుష్పహారములఁ గూర్చుట మొదలుగాఁ గలపనులు నెరవేర్చుపరిచారికగఁ జేర్చెను.

క. ఈవిధిఁ బాండవు లుండఁగ
ద్రోవదిఁ గాంక్షించి యుంట ♦ దుర్జ్ఞేయవిధిన్
దేవిసహోదరుఁ గీచకుఁ
బావని వధియించె భక్త ♦ వత్సలకృష్ణా! 73

తా॥ ఈరీతిని పాండవులు విరాటనగరంబున నజ్ఞాతవాసము జరుపుచు, కొలఁదిదినంబులు కొఱంతగా వత్సరకాలము గడపినయెడ, సుదేష్ణాదేవితమ్ముం డైన కీచకుఁడు పాంచాలిం గాంచి కామించి బాధించిన నామె యాసంగతి భీమున కెఱిఁగింప, నతఁ డన్యులు దన్నుఁ దెలిసికొనకుండునట్లు గంధర్వులవెపంబున నర్తనాగారమున నొకరాత్రి ఆకీచకుని రూపు మాపెను.

క. విని కీచకుమృతి, దుర్యో
ధనుఁ డటఁ బాండవులయునికిఁ ◆ దలఁచుచు మది వేఁ
గని వారిప్రతినఁ జెఱచెడు
పని రోయఁ దొడంగె భక్త ◆ వత్సలకృష్ణా! 74

తా॥ సింహబలుఁ డట్లు మృతిసెందుట దుర్యోధనుఁడు విని, భీమునిచేఁ జచ్చియుండు నని తలఁచి, అందుపై పాండవులు మత్స్యనగరంబున నుండవచ్చు ననునిశ్చయంబునకు వచ్చి, వారల నరసి సమయభంగముఁ గావించుమార్గము విచారింపఁ జొచ్చెను.

క. విరటునిగోవ్రులఁ బట్టిన
నరయఁగ నగుఁ బాండుసుతుల ◆ నని కౌరవ్యుం
డురవడిఁ బనిచెఁ ద్రిగర్తే
శ్వరుఁ డైన సుశర్మ భక్త ◆ వత్సలకృష్ణా! 75

తా॥ దుర్యోధనుఁడు విరాటునిగోగణంబులఁ బట్టుకొనిన పాండవులు ఆరాజుపక్షమునఁ బోరికి వచ్చి బయలు పడుదు రని యెంచి, త్రిగర్తదేశాధిపతి యగు సుశర్మ యనువానిని దక్షిణదిక్కునకు ససైన్యముగఁ బంపించెను.

క. ఆదక్షిణగోగ్రహణము
భేదింప సుశర్మ నొంచి ◆ భీముఁడు మత్స్యో
ర్వీదయితున కధికజయో
త్పాదన మొనరించె భక్త ◆ వత్సలకృష్ణా! 76

తా॥ ఆదక్షిణదిక్కునం దైనగోగ్రహణము నాపుటకు విరాటుఁడు నిజబలములతో వెడలిన ధర్మజభీమనకులసహదేవులు ఆరాజుం గలసి యేఁగిరి. భీముఁడు యుద్ధమునందుఁ దీవ్రముగఁ బోరి, సుశర్మ నోడించి మత్స్యదేశాధినాథుఁ డైనవిరటునకు సంపూర్ణజయమును చేకూర్చెను.

క. ఆలోనని దుర్యోధనుఁ
డాలం బొనవంగ నుత్త • రాశకు ఘనసై
న్యాళిం గొని చని, యట గో
పాలుర వడిఁ దాఁకె భక్త • వత్సలకృష్ణా! 77

తా॥ అదక్షిణగోగ్రహణము జరుగుచుండఁగనే దుర్యోధనుఁడు భీష్మద్రోణకర్ణాదియోధవీరుల వెంటఁగొని, ఉత్తరదిశకుఁ జని, అచ్చట గోపాలుర ముట్టి గోవులఁ బట్టుకొనెను.

క. అత్తరి విరటునిపుత్రకు
నుత్తరుఁ గని, పసులవార • లొగి వేఁడిరి యా-
యుత్తరగోగ్రహణంపుని
పత్తును బుచ్చుంగ భక్త • వత్సలకృష్ణా! 78

తా॥ ఆసమయమున పశుపాలకు లొకరివెనుక మఱియొకరు మత్స్యనగరమునకుఁ బోయి, విరటునిప్రియపుత్రుఁడైన ఉత్తరునిఁ గనుంగొని, అతనికి ఉత్తరగోగ్రహణవార్తఁ దెలిపి, ఆయాపదను దొలగింప రావలసిన దని మిగుల బ్రార్థించిరి.

క. పురి నపుడు విరటుబలములు
పరఁగమి నుత్తరుఁడు కృష్ణ • పంపునఁ బేడిన్
గుఱుకొని సూతుంగాఁ గొని
పరులపయిం జనియె భక్త • వత్సలకృష్ణా! 79

తా॥ అంతకుమున్నె విరాటరాజు తనచతుర్విధబలములతో దక్షిణగోగ్రహణయుద్ధమున కేఁగియున్నందున ఉత్తరునకు పట్టణమున రథచోదకు లెవ్వరును లేకపోయిరి. అప్పుడు ఉత్తరుఁడు ద్రౌపది చెప్పినమాటల నమ్మి, బృహన్నలను దనకు రథసారథిగాఁ గొని కౌరవసైన్యముల పైకి దాడి వెడలెను.

క. విని కీచకుమృతి, దుర్యో
ధనుఁ డటఁ బాండవులయునికిఁ ♦ దలఁచుచు మది వేఁ
గని వారిప్రతినఁ జెఱచెడు
పని రోయఁ దొడంగె భక్త ♦ వత్సలకృష్ణా! 74

తా॥ సింహబలుఁ డట్లు మృతిసెందుట దుర్యోధనుఁడు విని, భీము నిచేఁ జచ్చియుండు నని తలఁచి, అందుపై పాండవులు మత్స్యనగరం బున నుండవచ్చు ననునిశ్చయంబునకు వచ్చి, వారల నరసి సమయభంగ ముఁ గావించుమార్గము విచారింపఁ జొచ్చెను.

క. విరటునిగోవులఁ బట్టిన
నరయఁగ నగుఁ బాండుసుతుల ♦ నని కౌరవ్యుం
డురవడిఁ బనిచెఁ ద్రిగర్తే
శ్వరుఁ డైన సుశర్మ భక్త ♦ వత్సలకృష్ణా! 75

తా॥ దుర్యోధనుఁడు విరాటునిగోగణంబులఁ బట్టుకొనిన పాండ వులు ఆరాజుపక్షమునఁ బోరికి వచ్చి బయలు పడుదు రని యెంచి, త్రిగ ర్తదేశాధిపతి యగు సుశర్మ యనువానిని దక్షిణదిక్కునకు ససైన్యముగఁ బంపించెను.

క. ఆదక్షిణగోగ్రహణము
భేదింప సుశర్మ నొంచి ♦ భీముఁడు మత్స్యో
ర్వీదయితున కధికజయో
త్పాదన మొనరించె భక్త ♦ వత్సలకృష్ణా! 76

తా॥ ఆదక్షిణదిక్కునం దైనగోగ్రహణము నాపుటకు విరాటుఁడు నిజబలములతో వెడలిన ధర్మజభీమనకులసహదేవులు ఆరాజుం గలసి యేఁ గిరి. భీముఁడు యుద్ధమునందుఁ దీవ్రముగఁ బోరి, సుశర్మ నోడించి మత్స్యదేశాధినాథుఁ డైనవిరటునకు సంపూర్ణజయమును చేకూర్చెను.

క. ఆలోనసె దుర్యోధనుఁ
డాలం బొనరింగ నుత్త ♦ రాశకు ఘనసై
న్యాళిం గొని చని, యట గో
పాలుర వడిఁ దాఁకె భక్త ♦ వత్సలకృష్ణా! 77

తా॥ అదక్షిణగోగ్రహణము జరుగుచుండఁగనే దుర్యోధనుఁడు భీష్మద్రోణకర్ణాదియోధవీరుల వెంటఁగొని, ఉత్తరదిశకుఁ జని, అచ్చట గోపాలుర ముట్టి గోవులఁ బట్టుకొనెను.

క. అత్తరి విరటునిపుత్త్రకు
నుత్తరుఁ గని, పసులవార ♦ లొగి వేఁడిరి యా
యుత్తరగోగ్రహణంపువి
పత్తును బుచ్చంగ భక్త ♦ వత్సలకృష్ణా! 78

తా॥ ఆసమయమున పశుపాలకు లొకరివెనుక మఱియొకరు మత్స్యనగరమునకుఁ బోయి, విరటునిప్రియపుత్త్రుఁడైన ఉత్తరునిఁ గనుంగొని, అతనికి ఉత్తరగోగ్రహణవార్తఁ దెలిపి, ఆయాపదను దొలగింప రావలసిన దని మిగుల బ్రార్థించిరి.

క. పురి నపుడు విరటుబలములు
పరఁగమి నుత్తరుఁడు కృష్ణ ♦ పంపునఁ బేడిన్
గుఱుకొని సూతుంగాఁ గొని
పరులపయిం జనియె భక్త ♦ వత్సలకృష్ణా! 79

తా॥ అంతకుమున్నె విరాటరాజు తనచతుర్విధబలములతో దక్షిణగోగ్రహణయుద్ధమున కేఁగియున్నందున ఉత్తరునకు పట్టణమున రథచోదకు లెవ్వరును లేకపోయిరి. అప్పుడు ఉత్తరుఁడు ద్రౌపది చెప్పినమాటల నమ్మి, బృహన్నలను దనకు రథసారథిగాఁ గొని కౌరవసైన్యముల పైకి దాడి వెడలెను.

క. కురుసైన్య మరసి నంతనె
వెఱ గందఁగ నుత్తరుండు, ♦ వెస విన్వొచ్చెం
డెఱిఁగించి తమ్ము నాభూ
వరసుతుభయ ముడిపె భక్త ♦ వత్సలకృష్ణా! 80

తా॥ ఉత్తరుఁడు కౌరవసేనలఁ జూచినతోడనె మిగుల భయము నొంది, నిజపురాభిముఖుఁడు గాఁగ నప్పు డతనికి బృహన్నల తాను అర్జునుఁ డగుటఁ దెలిపి, తక్కుంగలపాండవులసంగతి సవిస్తరముగ నెఱిఁగించి, ఆరాజకుమారునిభీతిఁ బోలఁగించెను.

క. సారథిగ నప్పు డుత్తరు
నేరుపడం జేసి క్రీడి ♦ యొసఁగుచు రథి యై
తా రిహిఁ గౌరవసేనా
వారంబులఁ గవిసె భక్త ♦ వత్సలకృష్ణా! 81

తా॥ అంత, అర్జునుఁడు ఉత్తరునిఁ దనకు సారథిగఁ జేసుకొని, తాను రథికుఁడై ప్రహృష్టహృదయముతో కురుసైన్యసమూహముల సమీపించెను.

క. తటి యగుట నిర్భయంబుగఁ
బరవాహిని కెదరి నిల్చి ♦ పార్థుం డనిలో
నురువిజయ మంది కదుపులఁ
బరువడి మరలించె భక్త ♦ వత్సలకృష్ణా! 82

తా॥ అర్జునుఁడు అజ్ఞాతవాససమయము గూడఁ బూర్తియగుటచే నిర్భయముగ శత్రుసేనలఁ దాఁకి యుద్ధమున నెక్కుడుజయముఁ నొంది, గోవులను వరుసగ విరాటనగరము దెసకుఁ మరలునట్లు చేసెను.

క. కౌరవుల గెలిచి వచ్చిన
తీరంతయు నుత్తరుండు ♦ దెల్పఁగ మత్స్యో
ర్వీరమణుఁ డాత్మఁ బొంగెన
పారముదంబునను భక్త ♦ వత్సలకృష్ణా! 83

తా॥ ఉత్తరుఁడు ఉత్తరగోగ్రహణకార్యవిశేషంబు లన్నియుఁ గ్రమముగా జనకుఁ డగువిరాటరాజునకు విన్నవింప నతఁ డావిజయమును గూర్చి మనమునందు మిక్కిలి సంతోషము నందెను.

క. పూనిక దీరుటఁ బాండవు
లూనుచు నిజవేషభూష ♦ లుర్వీశునకున్
మానుగఁ ద మ్మెఱిఁగించిరి
బానిసతన ముడుగ భక్త ♦ వత్సలకృష్ణా! 84

తా॥ అంత, పాండవులు అజ్ఞాతవాససమయము గూడ సంపూర్తి యగుటచే తత్కాలోచితవేషముల నుజ్జగించి, ఎప్పటియట్ల రాజచిహ్నములఁ దాల్చి విరాటరాజునకుఁ దమనిజవృత్తాంత మంతయు నెఱిఁగించి, దాస్యవిముక్తులైరి.

క. విరటుఁ డపు డాత్మసుత ను
త్తర నభిమన్యునకు నిచ్చి ♦ ధర్మనియుక్తిన్
బరిణయము సేసె బంధులుఁ
బరివారము మెచ్చ భక్త ♦ వత్సలకృష్ణా! 85

తా॥ ఆమీఁద విరాటరాజు తనప్రియపుత్రిక నుత్తరను అర్జునుని కుమారుఁ డగునభిమన్యునకు హర్షముతో నొసఁగి, బంధుమిత్రుల రావించి విధ్యుక్తప్రకారము వివాహముఁ గావించెను.

క. ఇమ్ముగ నవల నుపప్లా
వ్యమ్మున కాపాండుపుత్రు ♦ లరిగి తమదుపా
లి మ్మని కురుపతి నడుగ శు
భ మ్మగు నను కొనిరి భ క్త ♦ వత్సలకృష్ణా! 86

తా॥ తరువాత పాండవులు ఉపప్లావ్యపురమునకుఁ బోయి, అక్కడ నుండి, ధృతరాష్ట్రునితో రాజ్యమునందుఁ దమపగముపాలుఁ బంచి ఇయ్యవలసినదగా రాయబారము నడుపుట ఎంతయూ శుభకర మని తలపోసిరి.

క. కౌరవులును బాండవులును
బోరుటయో లేక సంధి ♦ పొసఁగన్ మనుటో
యేరుపడ రాయబార ము
వారిగ నడపితివి భ క్త ♦ వత్సలకృష్ణా! 87

తా॥ ఓ కృష్ణా! కౌరవపాండవులు ఒండొరులతో యుద్ధము సేయుదము గాని సంధికార్యము నెఱవేరి ఉభయపక్షంబులవారు సుఖజీవనము సేయుదము గాని నిర్ణయ మగునట్లు నీవు రాయబారము అపారముగా జరిపితివి.

క. కరిపురమున కీ వరిగితి
వరమర లేకుండ విదురు ♦ నాతిథ్యమునన్
గర ములరితి వాభక్తుని
వరసదనమునందు భ క్త ♦ వత్సలకృష్ణా! 88

తా॥ నీవు హస్తినాపురమునకుఁ జని అక్కడ దుర్యోధనునియాతిథ్యముఁ గొనక, పరమభక్తుం డగు విదురునిగృహంబున అనుమానరహితముగా విడిది సేసితివి.

క. గురుకృపులు, విదురభీష్ములుఁ,
గురుపతి, దుర్యోధనుఁడు, శ ♦ కుని, కర్ణాదుల్
వఱలినసభ కావిూఁదటఁ
బరమాత్మా! చనితి భ క్త ♦ వత్సలకృష్ణా! 89

తా॥ అంత నీవు ద్రోణాచార్యుఁడు కృపాచార్యుఁడు విదురుఁడు భీష్మాచార్యుఁడు ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుఁడు శకుని కర్ణుఁడు మొదలుగాఁ గల ముఖ్యులు గూడియున్న కౌరవసభాస్థానమునకుఁ బోయితివి.

క. ఆసభఁ గురువరుతో మతి
భాసిలఁ బాండవులకుఁ దమ ♦ పైతృక మగు ను
ర్వీసామ్రాజ్య మొసఁగి, భువి
వాసిగ మను మంటి భ క్త ♦ వత్సలకృష్ణా! 90

తా॥ ఆకురుసభాస్థలమున దుర్యోధనాదులతో మంచిబుద్ధిఁ గలిఁగి పాండవులకు వారిపితృభాగ మగు సగమువంతురాజ్యము నిచ్చి, భూమియందు కీర్తిసంపన్నులై, సుఖముగా నుండుఁ డని చెప్పితివి.

క. బలయుతు లగు పాండవులకు
నిలపా లిపు డీయకున్న ♦ నెనసినచేవన్
గలనం గైకొనఁ గల రని
పలికితి వాసభను భ క్త ♦ వత్సలకృష్ణా! 91

తా॥ మఱియు, ఆకౌరవసభయందు బలవంతు లైనపాండవులకు ఇప్పుడు రాజ్యభూమిలో భాగ మీయనియెడల వారు నిండుపౌరుషముతో యుద్ధమున జయించి, పుచ్చుకొనఁ జాలుదు రని నుడివితివి.

క. అన విని దుర్యోధనుఁ డపు
డని సేయఁగ వలయుఁ గాని ♦ యణుమాత్రంబున్
దనరాజ్యభాగ మిచ్చెడు
నని తే దని నుడివె భక్త ♦ వత్సలకృష్ణా! 92

తా॥ నీవు అట్లు సంధివాక్యములు పలికినతోడనె దుర్యోధనుఁడు యుద్ధమే జరుగవలె ననియుఁ, దనరాజ్యమునందు వాడిసూది మొన మోపినంత భాగ మైనను పాండవులకుఁ బంచి యివ్వఁ బడదనియుఁ జెప్పెను.

క. హితనయమార్గములను నీ
వతికుశలతఁ దెల్పఁ గౌర ♦ వాగ్రజుఁడు నినున్
మతిమాలి కట్టఁ జూచెను
బ్రతికూలుం డగుచు భక్త ♦ వత్సలకృష్ణా! 93

తా॥ మేలుఁ గలిగించునట్టియు న్యాయ మైనట్టియు మాటలను నీవు మిగుల నేర్పుతోఁ దెలుపఁగా కౌరవజ్యేష్ఠుఁ డైనదుర్యోధనుఁడు ఇష్టపడక బుద్ధివిహీనుఁడై నిన్ను బంధింప యత్నించెను.

క. నిండుసభఁ గట్ట నే నొక
రుండనె? యని నీదువిశ్వ ♦ రూపంబు సను
ద్దండగతిఁ జూపి వచ్చితి
పాండవులను జేర భక్త ♦ వత్సలకృష్ణా! 94

తా॥ అప్పుడు, "సురముఖ్యు లాదిగాఁ గలవారితో నిండియున్న ఈసభాస్థలమున నన్నుఁ గట్టుటకు నేను ఒక్కఁడనే కాను" అని పలుకుచు భీష్మద్రోణవిదురులును ధృతరాష్ట్రుఁడును దివ్యదృష్టిఁ గొని ఆశ్చర్యనిమగ్ను లై చూచుచుండ ఓ కృష్ణా! నీవిశ్వప్రపంచరూపమును జూపించి, అటనుండి బయలుదేరి, పాండవులఁ గలయ వచ్చితివి.

క. అంతటఁ గురుసభఁ బుట్టిన
వింతలు విషయములు నీవు ♦ విశదము సేయన్
గౌంతేయు లాల మొనరుపఁ
బంతముఁ గైకొనిరి భ క్త ♦ వత్సలకృష్ణా!		95

తా॥ పిమ్మట నీవు పాండవులకు కౌరవసభయందు జరిగిన సకల సంభాషణములఁ గూర్చియు, దుర్యోధనాదులదుండగములఁ గూర్చియు తెలియఁ జేయ వారు యుద్ధము సేయఁ బూనిరి.

క. మతి ధర్మసూనుఁ డుచిత
స్థితి నారసి, ద్రుపదపుత్రు ♦ ధృష్టద్యుమ్నున్
హితమున నిజసేనల కధి
పతిగా నియమించె భ క్త ♦ వత్సలకృష్ణా!		96

తా॥ అప్పుడు ధర్మరాజు కృష్ణా! నీతోడను, తమ్ములతోడనువిచారించి, ద్రుపదమహారాజుయొక్క కుమారుఁడైన ధృష్టద్యుమ్నుని సంతోషముతో సర్వసైన్యాధిపతిగా నభిషేకించెను.

క. పోరున సారథి వగు మని
కోరుట నిను సవ్యసాచి ♦ గొనకొని నీ వా
భారముఁ బై నిడుకొంటి వ
పారకృపాలీల భ క్త ♦ వత్సలకృష్ణా!		97

తా॥ ఓ కృష్ణా! అర్జునుఁడు యుద్ధమునందుఁ దనకు రథసారథ్యము సేయవలసినదిగా నిన్ను భక్తిశ్రేష్ఠులు దొలుకాడ వేఁడుకొని యుండుటచే దయతో నీ వాకార్యము నిర్వహింపఁ బూనుకొంటివి.

క. పాండవు లే డక్షోహిణు
లుండినతమబలముఁ గొంచు ♦ నొగి వెడలిరి నీ
యండఁ గురుక్షేత్రంబున
భండనమును సలుప భక్త ♦ వత్సలకృష్ణా! 98

తా॥ అంత, పాండవులు అభిమన్యుఁ డాదిగాఁగలకుమారవర్గముతోను, యాదవమత్స్యపాంచాలరాజప్రభృతులతోను గూడి యున్నట్టి తమ యేడు అక్షోహిణులసైన్యమును దీసికొని నీసహాయముతో కురుక్షేత్రమందు సంగ్రామము సేయ బయలుదేరి వెళ్ళిరి.

క. పదునొకఁ డక్షోహిణులం
బొదలిన నిజసైన్యవర్గ ♦ ములు గొలువంగాఁ
గదనక్షోణికి వచ్చెను
బదఁపడి కురువరుఁడు భక్త ♦ వత్సలకృష్ణా! 99

తా॥ పిమ్మట దుర్యోధనుఁడు దుశ్శాసనాదిసోదరులు, పుత్రులు, భీష్ముఁడు, కృపుఁడు, ద్రోణుఁడు, ద్రోణతనయుఁ డగు అశ్వత్థామ, కర్ణుఁడు, శకుని, మద్రదేశాధీశ్వరుఁ డైన శల్యుఁడు మొదలుగాఁ గల వీరవరులతో నిండిన పదునొక్కయక్షోహిణులసైన్యము వెంట రా బయలు వెడలి, యుద్ధభూమిఅయిన కురుక్షేత్రమున పాండవులఁ జేరవచ్చెను.

క. స్వజనము రణమునఁ ద్రుంచుట
వృజినం బని సంశయించు ♦ విజయునిబుద్ధిన్
నిజయోగవిద్యఁ దేల్చితి
భజియింపఁగ నిన్ను భక్త ♦ వత్సలకృష్ణా! 100

తా॥ అర్జునుఁడు ఉభయపక్షములవారును నాత్మ బంధువులగుటచే వారలను యుద్ధమునఁ జంపవలసివచ్చినందునకు శంకించుచుండ ఓ కృష్ణా! దయామయుండ వగు నీవు గీతోపదేశ మొనర్చి, యోగశాస్త్ర మంతయు విపులముగా బోధించి, ఆతనిమనసు మరలించితివి.

క. మొదటిపదినాళ్లు నదీ
నందనుఁ డాకురుబలాధి • నాథుం డగుచున్
గ్రందుగఁ బోరె నరాతులు
వందుర మదు లందు భక్త • వత్సలకృష్ణా! 101

తా॥ మొదటిపదిదినములు యుద్ధమునందు భీష్మాచార్యుఁడు కౌరవసైన్యములకధిపతిగానుండి, శత్రుపక్షమువారెల్లరు అతనిశౌర్యసంపదకును అస్త్రకళానిపుణతకును వెఱచి, చిత్తములందుఁ గుందునట్లుపోరాడెను.

క. అంత శిఖండిపిఱిందిని
వింతగ నరుఁ డుండి యలుఁగు • విడిచినకతనన్
జింతిలక పడెను భీష్ముఁడు
పంతం బటు లుంట భక్త • వత్సలకృష్ణా! 102

తా॥ ఆమీఁదట అర్జునుఁడు ద్రుపదపుత్రుఁడైనశిఖండి యనువంగనాపూర్వునిఁ దనముందఱ నుంచుకొని యుద్ధము సేయఁ బ్రారంభించుటచే, భీష్ముఁ డట్టివానితోఁ బోర నని అంతకుమున్నె ప్రతినఁ దాల్చియుండినందున యుద్ధముఁ జాలించి, ప్రాయోపవేశము నందెను.

క. పదఁపడి యైదుదినంబులు
ముదమున ద్రోణుండు సైన్య • ముల నడపి, తుదన్
మది నొక్కనిసను వేచఁగ
వదలుచు విలుఁ, గూలె భక్త • వత్సలకృష్ణా! 103

తా॥ పిమ్మట ఐదునాళ్ళు ద్రోణాచార్యుఁడు దండనాథుఁడై పద్మవ్యూహము మొదలైన పెక్కువ్యూహములఁబన్ని, అభిమన్యుఁ డాదిగాఁగల మహావీరులననేకులఁ దూలించి, కడకు నిజపుత్రుఁడైన అశ్వత్థామ రణమున మడిసె ననుదుర్వార్తాశ్రవణము మనమును వేధింప నిజముగాఁ దనతనయుఁడు చనిపోయెనని యెంచి, అస్త్రసన్యాసము వహించి, పోరఁ జాలించెను.

క. తరువాత రెండుపొద్దులు
కురుసేనల కధిపుఁ డగుచు ♦ గురుతరశక్తిన్
దుర మొనరించి, నరుచే ను
ర్వరఁ బడెఁ గర్ణుండు భక్త ♦ వత్సలకృష్ణా! 104

తా॥ అప్పైని రెండుదినములు రాధానుతుఁడైన కర్ణుఁడు మహాశక్తియుక్తులతోఁ గురుసేనల నడిపి, ఘోరయుద్ధము సలిపి, చిట్టచివరకు అర్జునునిబాణపరంపరలకు లోనై వీరస్వర్గముఁ జూఱగొనెను.

క. మఱునాఁటిపగలు శల్యుఁడు
నెఱలుచు దళవాయి గాఁగఁ ♦ బవరము సలిపెన్
గర మరుదుగ, నాధరణీ
వగు ధర్మజుఁ డడఁచె భక్త ♦ వత్సలకృష్ణా! 105

తా॥ కర్ణుఁడు పడినమఱునాఁటిపగ లంతయును (మద్రదేశాధినాథుఁడును, నకులసహదేవుల మేనమామయును నగు) శల్యుఁడు కౌరవబలమున కధిపతియై చూపఱ కచ్చెరు వగునట్లు పోరి ధర్మరాజుచేఁ మృతి నొందెను.

క. ఆరాతిరి దుర్యోధనుఁ
డారాటము నెంది, మారు ♦ తాత్మజుతోడన్
బోరి గదాహతిఁ గూలెను
వారని దుఃఖమున భక్త ♦ వత్సలకృష్ణా! 106

తా॥ ఆనాఁటిరాత్రి దుర్యోధనుఁడు మనఃపరితాపము నొంది, ద్వైపాయనహ్రదమున దాఁగికొని యుండి, పాండవులచే హెచ్చరింపఁ బడి బయటకు వచ్చి, భీమునితో గదాయుద్ధ మొనర్చి, అందుఁ దన యూరువులఁ గోల్పోయి పరలోకగతుం డయ్యెను

క. పదునెనిమిది దివసంబులు
కదనం బటు లయ్యె, నందు ♦ ఘనవిజయంబున్
ముదమునఁ బాండవు లందిరి
వదలెను భూభరము భక్త ♦ వత్సలకృష్ణా! 107

తా॥ ఆప్రకారము పదునెనిమిదిదినములు భారతమహాసంగ్రామము జరిగెను. అందు పాండవులు గెలుపొందిరి; కౌరవులు ఓడిరి. అంతటితో భూభారమంత తొలంగెను.

క. శ్రీ మెఱయ నంత ధర్మజుఁ
బ్రేమంబున హస్తిపురికిఁ ♦ బృథ్వీపతిగా
నేమించి, యేలితివి ప్ర
భామయ! సాధువుల భక్త ♦ వత్సలకృష్ణా! 108

తా॥ ఓ కృష్ణా! నీ వంతట ధర్మరాజును శుభకరముగా కురురాజ్య సింహాసనాధిష్ఠితుఁ గావించి, శిష్టజనసమూహములఁ గృపతోఁ గాపాడితివి.

క. ఆధర్మజుపాలనమున
శ్రీధర! నీసేవ ధర్మ ♦ చింతన మొనయం
గా ధరఁ బ్రజ లొప్పిరి యే
బాధల నొందకయ భక్త ♦ వత్సలకృష్ణా! 109

తా॥ శ్రీదేవిని వక్షస్థలమున ధరించినవాఁడవు నైన ఓ కృష్ణా! ఆధర్మరాజుపరిపాలనమందు భూమియందలిజను లందఱు నిత్యము నీ ధ్యానమందును ధర్మతత్పరులై ఎట్టిబాధలను బొందక సుఖజీవనులై ప్రకాశించిరి.

క. ఘన మగుభారతిగాథను
నిముఁ బేర్కొని శతకమంచు ♦ నేర్చినభంగిన్
దనరఁగఁ గూర్చిన యీకృతి
వనజాక్షా! కొనుము భ క్త ♦ వత్సలకృష్ణా! 110

తా॥ ఓ పుండరీకాక్షా ! అపారమైనభారతకథను ఈకవి నిముఁ దలఁచుచు శతకమున రచించి, నీకు అంకితముఁ జేసెను గాన కృపతోఁ బరిగ్రహించుము.

క. పిసిపాటి సుబ్బయార్యున
కసదృశసుగుణమణి నరస ♦ మాంబకు సుతుఁడై
యొసఁగిన సోమయ సత్కృవి
వసుధను గృపఁ జూడు భ క్త ♦ వత్సలకృష్ణా! 111

తా॥ ఓ భక్తవత్సలా ! కృష్ణా! పిసిపాటి సుబ్బయార్యునకును అయానధర్మపత్నియు సకలసద్గుణసంపన్నురాలు నైన నరసమాంబకును పుత్రుఁడగు సోమయాఖ్యకవిని దయతో వీక్షించుము.

క. ఈసత్కృథఁ బఠియించిన,
వ్రాసిన, నిశ్చింత వినిన ♦ బహుళాయుష్య
శ్రీసంతానసుఖంబులు
వాసిగఁ జేకూరు భ క్త ♦ వత్సలకృష్ణా! 112

తా॥ పరమాత్ముఁడ వైన ఓ కృష్ణా! ఈమహాభారతపుణ్యకథను వ్రాసినవారును, జదివినవారును, నిర్మలమైనమనస్సుతో వినినవారును నీదయవలన దీర్ఘాయువును, సమస్తసంపదలను, సత్సంతానమును, ఇహపరసౌఖ్యములను, దప్పక పొందఁగలరు.

స ం పూ ర్ణ ము.

—⁂—